## వెల్లంకి పూర్ణచంద్రరావు



(జీవిత చరిత్రలలో 151 వ పేజీ చూడండి)

## చాపల వెంకటేశ్వరరావు



చాపల వెంకటేశ్వరరావు మొగల్‌రాజపురం (విజయవాడ) వాస్తవ్యులు. బెజవాడ ప్రెస్ వర్కర్స్ యూనియన్ ప్రథమ కార్యదర్శి. ఆంధ్రరాష్ట్ర ప్రెస్ వర్కర్స్ యూనియన్ కోశాధికారి, 1940లో యుద్ధ వ్యతిరేకంగా అఖిలభారత కమ్యూనిస్టు పార్టీచే రహస్య ముద్రాలయం స్థాపించబడింది. అందులో బ్రిటిష్ వ్యతిరేక సాహిత్యం ముద్రించబడింది. రహస్య స్థావరంలోనే వెంకటేశ్వరరావుగారు 1941 నవంబర్ 4వ తేదీన 32వ ఏట చనిపోయారు. గాలపింగ్ టి. బి. కి గురియై, వైద్య సహాయం చేసినా కోలుకోలేక మృతిచెందారు.

## గోళ్ళ రాధాకృష్ణమూర్తి

గోళ్ళ రాధాకృష్ణమూర్తి తండ్రి నారాయణరావు. వయస్సు 70 సంవత్సరాలు. బి. ఎ. బి. ఎల్. నివాసం విజయవాడ. మద్రాస్‌లో 1937 నుండి విద్యార్థి ఉద్యమంలో పని చేశారు. 1938-39 సంవత్సరాలలో మద్రాస్ సాహుకార్ పేట కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులుగా పనిచేశారు. 1939లో 2 వ ప్రపంచ యుద్ధకాలంలో యుద్ధానికి వ్యతిరేకంగా రహస్యంగా ఉండి పని చేశారు. 1940లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. మద్రాస్‌లో 1942లో అరెస్టు చేసి వెల్లూరు జైలులో డిటెన్యూగా ఉంచబడ్డారు. కొద్ది నెలల తరువాత విడుదలయ్యారు. విడుదల అనంతరం ప్రజాశక్తి దినపత్రిక జనరల్ మేనేజరుగా పనిచేశారు. 1946లో తిరిగి అరెస్టుచేసి డిటెన్యూగా జైలుకు పంపబడ్డారు. 6 మాసములు జైల్లో ఉన్నారు. 1948-1949లలో తెలంగాణా ఉద్యమంలో పనిచేస్తూ రహస్య జీవితం గడిపారు.

## వాసిరెడ్డి శివలింగ ప్రసాద్



గుంటూరు జిల్లా చినపాలెం వాస్తవ్యులు. కొన్నేళ్ళుగా కృష్ణాజిల్లా నందిగామలో ఉంటున్నారు. తండ్రి సీతారామయ్య.

1937లో రెడ్డినాయుడు ప్రభుత్వం నిషేధించిన కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు పబ్లిసిటీ ఆఫీసరు. రాజద్రోహ ఉపన్యాసం ఇచ్చారని ఒక సంవత్సరం శిక్ష విధించారు. రాజగోపాలాచారి మంత్రివర్గం ఏర్పడిన తర్వాత విడుదలయ్యారు. యుద్ధకాలంలో 5-10-40 నుండి 25-6-42 వరకు వెల్లూరు జైలులో డెటెన్యూగా ఉన్నారు. రైతు ఉద్యమంలో కృషి చేశారు.